# శ్రీ మెహెర్

# సుభాషితములు




మెహెర్ పబ్లికేషన్స్ (ఆంధ్ర) లిమిటెడ్

నిడదవోలు — రామనగర్

(పశ్చిమ గోదావరి జిల్లా)

# శ్రీ మేహేర్
# సుభాషితములు

అనువాదము :

డాక్టర్ తోట ధనపతిరావు నాయుడు, L. M. & S.



ప్రకాశకులు :

మెహేర్ పబ్లికేషన్స్ (ఆంధ్ర) లిమిటెడ్

హెడ్డాఫీసు:-

నిడదవోలు. (రామనగర్)

పశ్చిమగోదావరి జిల్లా

1954

వెల 1—0—0

ప్రథమ కూర్పు-
1000 ప్రతులు.

ప్రకాశకుడు-
ఇవటూరి చెన్నమల్లికార్జునరావు.
మేహేర్ పబ్లికేషన్స (ఆంధ్ర) లిమిటెడ్
రామనగర్ - నిడదవోలు.
(పశ్చిమగోదావరి జిల్లా)

అవంతీ ప్రెస్,
రాజమహేంద్రవరము.

"ఆత్మ జాగృతిని గల్గించుటకే, నే నవతరించితిని గాని,
శబ్దజ్ఞాన మిచ్చుటకు గాదు"

—శ్రీ మేహెర్ బాబా.

# విషయ సూచిక

అధ్యాయము



# అవతార్ శ్రీ మేహేర్ బాబా

"ఆత్మజాగృతిని గలిగించుటకే నే నవతరించితిని గాని
శబ్దజ్ఞాన మిచ్చుటకు గాదు."

—మేహేర్ బాబా

## అంకితము

శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద ప్రేమస్వరూప పురుషోత్తమ
అవతార సద్గురు శ్రీ మెహెర్ బాబావారి
దివ్య పాదారవిందములకు.

—అనువాదకుడు.

# ఒక్కమాట :

ఆర్యా !

వివిధ రూపములుగా నేచేయు శ్రీ బాబావారి ఆధ్యాత్మిక కార్యకలాపమందు గత నాలుగైదు సంవత్సరములనుండియు సర్వవిధముల నాకు సాహాయ్యులుగా నున్న లలితకళోపాసకులు శ్రీ బాలగోపాల భాస్కర రాజుగా రెంతయూ అభినందనీయులు.

ఈ సుభాషితములయం దుచిత సలహాల నొసంగి సహాయ పడిన న్యాయవాదులగు శ్రీ ఉప్పు నారాయణమూర్తి B.A.,B.L., గారు మిక్కిలి అభినందనీయులు.

—అనువాదకుడు.

# పరిచయము

ఆర్యా!

ఈ సుభాషితములు శ్రీ బాబావారి యాజ్ఞ ననుసరించి ప్రియమిత్రులు శ్రీ డాక్టర్ తోట ధనపతిరావునాయుడు L. M & S గారిచే ననువదింప బడినవి. వీరు తాడేపల్లిగూడెం వాస్తవ్యులు.

వర్తమాన యుగమందలి భగవదవతారపురుషులైన శ్రీ మేహేర్‌బాబా వారిని ప్రప్రథమముగా తెలిసికొని, వారి నాంధ్రలోకమునకు పరిచయ మొన రించుటయేగాక, ఆంధ్రభక్తులకు శ్రీవారి దివ్యదర్శన భాగ్యమును, సంబంధ మును కలుగజేసిన మహనీయులు. శ్రీవారిని గాఢముగా ప్రేమించు ప్రేమోన్మాది. ఆంగ్లములో శ్రీ బాబావారు వ్రాసిన "Sayings of Meher Baba" యను చిన్న పొత్తమందలి భావార్థ ధ్వనులను తూకము పోకుం డగా, పొంకము చెడకుండగా రసవంతమగు చక్కని సులభశైలిలో సరళ మైన భాషలో ననువదించి ఆంధ్రలోకమున కందించి, ఆధ్యాత్మికముగా మహోత్తమమైన సేవ జేయుచున్నారు.

వీరింతకుపూర్వము తెలుగులో "అవతార్ సద్గురు శ్రీ మేహేర్ బాబా" యను నొక చిన్న గ్రంథమును వ్రాసియున్నారు. వీరిభాష ఆబాలగోపాల మున కందుబాటులో నుండును. వీరు రచించిన గ్రంథములలో నిది రెండవది (తర్జుమా).

మేహేర్ పబ్లికేషన్స్ (ఆంధ్ర) లిమిటెడ్; తరపున నాకీ గ్రంథమును ప్రచురించు నవకాశమును గల్పించినందులకు నేను కృతజ్ఞుడను. ఇందలి శ్రీ బాబావారి యద్వైత బోధామృతమును గ్రోలినవారికి తప్పక నాత్మ జాగృతి గలిగి, జ్ఞానోదయమై భగవంతునియందును, సర్వ మానవుల

యందును ప్రేమభావము గలిగి, వారు నిస్వార్థసేవకులుగా ప్రేరేపింప బడు దురనుటలో సందియములేదు. ప్రతి ఆధ్యాత్మిక సాధకుడునూ తప్పకచదివి తరించెదరుగాత !

ఈ సుభాషితముల నిదివరకే రాజమహేంద్రవరము నుండి వెలువడు చున్న "వెలుఁగు" యను స్వతంత్ర వారపత్రికా ముఖమున ఆంధ్రులకు పరిచయము చేసిన పత్రికా సంపాదకులు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు మిక్కిలి ధన్యతములు.

నిడదవోలు,
1954.

ఇట్లు,
ఇ. చె. మల్లికార్జునరావు.
ప్రచురణ కర్త.

# శ్రీ మేహెర్ సుభాషితములు

## ప్రథమాధ్యయము

## దివ్యప్రేమ

ఆ నిజప్రియుడైన భగవంతుడు నీమనస్సనెడి గృహమందు ప్రవేశించుట కెల్లప్పుడూ సంసిద్ధుడుగనే యున్నాడు. కాని, కోరికలనెడి అసంఖ్యాక మిథ్యాప్రియులు నీమనస్సనే యింటిలో (ఇదివరకే) ప్రవేశించియుండుటచే భగవంతునకచ్చట తావు లేనందున, ఆయన నీయింట ప్రవేశించలేకున్నాడు.

★ ★ ★

నీ ప్రియుడైన భగవంతునికి నీవు దూరమగుటకు కారణము నీవే. అహమనుదానిని నశింపజేసినప్పుడే, నీవు భగవంతునితో నైక్యతను పొందెదవు.

★ ★ ★

నీ ప్రియునకు నీ జీవితము సంకేతము జేయుటయే లేక, నీ సర్వస్వము సమర్పించుటయే నిజమైన ప్రేమ. నీ ప్రియునుండి ప్రత్యామ్నాయముగా సౌఖ్యము నపేక్షించక కేవలమూ నీ ప్రియునియొక్క సౌఖ్యము నపేక్షించుటయే నిజమైన ప్రేమ.

★ ★ ★

ఆ మహోన్నతమైన దివ్యజ్ఞానము కేవలము ప్రేమవలననే కలుగుచున్నది. ఆ ప్రేమలో ఆధ్యాత్మిక జ్ఞానమును, సంస్ఫురణయు, ఆత్మప్రబోధమును యిమిడియున్నవి. అయ్యది భావనాపటిమకు వ్యతిరేకముగా

నుండును. ఆ దివ్యప్రేమయే భావనాశక్తి కతీతమై విలసిల్లి, అహంకార నాశనమునకు కారణమగుచున్నది. ఈ మహోన్నత స్థితియే తుదకు బ్రహ్మైక్యతను కలుగజేయును.

★ ★ ★

ద్వేషమువలన ప్రతీకార బుద్ధి జనించును. ప్రేమవలన క్షమార్పణబుద్ధి కలుగును. అపకారమును మరచుట, అపకారిని క్షమించుటయను ఘనమైన ఉదార భావములు, ప్రేమలేనిదే కలుగనేరవు. నీ అపకారిని నీవెంతగా ప్రేమించెదవో, అంత సులువుగా ఆతడు నీ కొనరించిన తప్పిదములను క్షమించగలవు.

★ ★ ★

ఒక రోగమును దానియొక్క విరుగుడు మందువలననే నీవు నివారించగలవు. ద్వేషమునకు ప్రేమ ఒక్కటియే విరుగుడు. ఒకనియందు నీకు ద్వేషభావము కలుగునప్పుడు ఆతడు నీయొక్క స్వస్వరూపమేయని జ్ఞాపకము చేసికొనుము.

★ ★ ★

వేలమంది శత్రువులపై విజయము సాధించుటకంటె, ఒక్క శత్రువు యొక్క హృదయమును నీవైపునకు మరలించుటమే మిన్నయైన పౌరుషము. నీయొక్క పరమశత్రువును నిత్యము సద్భావముతో తలంచుటవలన నీ మనస్సతనిని నీ ప్రియమిత్రునిగా మార్చగలదు.

★ ★ ★

ఈర్ష్య ప్రేమవలన జనించుటలేదు. కాని నీచమైన మనోభావమువలన కలుగుచున్నది. ఎప్పుడైతే, యీ నీచమనోభావము నశించునో, అప్పుడే ఈర్ష్యకూడా నశించును.

★ ★ ★

నిజమైన సౌఖ్యము "ఏకత్వము" నందే యిమిడి యున్నది. ఎచ్చటైతే ద్వైతభావము కలదో, అచ్చటనే ప్రమాదము కలదు.

★ ★ ★

ప్రేమ తరతమ భేదములులేని స్వాభావిక మరణమువంటిది. అయ్యది హోదాలను, మోటుతనమును, హెచ్చు తగ్గులను ఎట్లు నిర్మూలించునో. అదేవిధముగా ప్రేమకూడా తారతమ్యములు లేని మరణమును బోలి యున్నది.

★ ★ ★

ఈ భౌతికాలంకారములు నిజమైన దివ్యప్రేమికు నాకర్షించజాలవు. ఆ పురుషునకు విషయాసక్తి జనించదు. అప్పుడే నీటినుండి బయటపడిన మత్స్యమువలె తపించుచు తన ప్రియుడైన భగవంతునితో మేళవించు వరకు తహతహ లాడుచుండుటచే గాఢనిద్ర ననుభవింపజాలడు.

★ ★ ★

ఆధ్యాత్మికయానము సలుపుచున్న ప్రేమపాంథుని ఆ దివ్యప్రేమ బంధించుచున్నది. అప్పుడా దివ్యప్రేమ సంకుచిత భౌతిక బంధములను క్రమక్రమముగా సడలించి, ఆతని వ్యష్టిజీవనమును పూర్తిగా మరపించి, తుదకాతనిలోనున్న పరమాత్మునితో అనుసంధానము పొందగల ఉన్నత స్థాయికి కొనిపోవును.

★ ★ ★

నిజమైన ప్రేమ అనగా, ఆ యనంతాత్మయగు భగవంతుని ప్రేమించుటయే. అనగా – ఆయనను చూడవలెననీ, తెలిసికొనవలెననీ, అనుభవించవలెననీ ఆ సత్యపదార్థముతో నైక్యము గావలెననెడి ప్రగాఢమగు ఉత్కంఠయే నిజమైన ప్రేమ. దేవుని చూచుటనగా — తదితరములు వేనినీ చూడకుండి, ప్రతిచోటా దేవుని మాత్రమే చూచుట.

★ ★ ★

# ద్వితీయాధ్యాయము

# మతములు - మతాచారములు

ఆరాధన హృదయజన్యమై యుండవలెను. నిరంతర తీవ్రకృషి వలననే గాని హృదయారాధన జనించదని మనము జ్ఞాపకముంచుకొనవలెను. కేవలము, వాంఛితమువలననే ఆరాధన కలుగుటలేదు. ఎవరైతే నిజమైన భక్తినలవరచుకొన నిశ్చయించుకొందురో, ఆ వ్యక్తి మనోనిశ్చలత్వమును పొందుటకై బ్రహ్మాండ ప్రయత్నములు చేయవలెను. ఏలననగా – పరస్పర విరుద్ధభావములు మనస్సును చలింపజేయును.

★ ★ ★

ఆధ్యాత్మిక వేదాంత మహదాశయములపై నాధారపడియుండి దివ్య ప్రేమచే ప్రేరేపింపబడిన నిజమైన భక్తియోగము దీర్ఘోపాసనయే. అప్పుడు ప్రతిమత సిద్ధాంతములయొక్క వివిధ కర్మాచారములునూ దాని యంతర్భాగమై దాని ఛాయా రూపమై పొడగట్టుచున్నవి.

★ ★ ★

నీవు దేవునికి భయపడినచో దేవుని యెట్లు ప్రేమించగలవు? కావున దేవుని జూచి భయమొందకుము. భయ - ప్రేమలెప్పుడునూ ఒందొంట కలిసియుండవు. ఎన్నడూ దేవుని గురించి భయపడక, దేవుని ప్రేమించు వాడే నిజమైన మతావలంబకుడు (భక్తుడు).

★ ★ ★

మనము నమ్రత యను బలిపీఠమందు మన ప్రార్థనలను పరమాత్మునకు సమర్పించవలయును. ఆధ్యాత్మికముగా, భక్తికంటె అణకువయే చాలా గొప్పవిలువ గలది. అణకువ గల్గియుండుటకంటె, భక్తిగలిగియుండుట

చాల సుళువు. కాని, అనేక సందర్భములను బట్టి చూడగా, భక్తియే నమ్రతకు ప్రథమ సోపానమని నిరూపించుచున్నది.

★ ★ ★

వైదిక కర్మ ధర్మములను పాటించుట, మంత్రములను జపించుట, మంత్రోదాత్తము మొదలగునవి పాటించుట నిజమైన భక్తిగా నుద్దేశింపబడవు. కాని నిర్విరామముగా యేదేని నొక భగవన్నామము నుచ్చరించుట, లేక భగవంతుని నిరంతరము తలంచుట, జ్ఞప్తియందుంచుకొనుటయే నిజమైన భక్తియనబడును.

★ ★ ★

లక్షలాది ప్రజానీకము దైవముతప్ప మరెద్దియూ లేదని చెప్పుచున్నప్పటికీ, అనేకమ్మందికి యీ భౌతిక ప్రపంచమే సర్వస్వమునై యున్నది. వారికి పరమాత్ముడసత్యము లేక మాయారూపము.

★ ★ ★

భౌతికాభ్యుదయమునకై దేవుని ప్రార్థించుట కేవలము వట్టి బూటకమే గాని నిజమైన ప్రార్థనగాదు.

★ ★ ★

"జొరాస్టరు జయంతి" నాడు పారశీకు లనేకులు హృదయపూర్వకముగా చేయు ప్రార్థన యేమనగా — "జొరాస్టరుప్రభువుయొక్క ఆత్మకు శాంతి గలుగుగాక!" యని ప్రార్థించెదరు. నిజముగా వారు తమ ప్రవక్తయొక్క ఆధ్యాత్మికోన్నతస్థితి బొత్తిగా తెలియని అజ్ఞానులై సిగ్గుమాలిన మిక్కిలి యజ్ఞానస్థితియందున్నారు. పరమాత్మయైన జొరాస్టరు ప్రభువునకటువంటి ప్రార్థనలు నివేదించుటకంటె మరొక గొప్ప అవమానకరమైన విషయమెద్దియు లేదు.

★ ★ ★

ఏదేని వైదిక సిద్ధాంతముల నంగీకరించుటచేగాని, వందలాది లేక వేలాది సంవత్సరములకు పూర్వము జీవించియున్న ప్రవక్త యొక్కడే అవతారపురుషుడనిగాని, లేక అతడొక్కడే నిజమైన రక్షకుడనిగాని, కడపటి నిజమైన దేవమాతయనిగాని పరిగణించుట వలన నీవు ముక్తి నొందజాలవు. నీవు రక్షింపబడగోరినచో, నీ మనస్సును జయించి పవిత్ర జీవనము సలిపి, నీచవాంఛలను విడనాడి నీకు సంపూర్ణవిశ్వాసముగల బ్రహ్మైక్యతజెందిన ఒక సద్గురువును సేవించుటవలన నీవు ముక్తుడ వయ్యెదవు.

★ ★ ★

పారశీకులు, హిందువులు, తదితరమతావలంబకులు చేయు మతకర్మ కాండలు చాలవరకు అనవసరమై విలువలేనివై యున్నవి. ఏలనన, యీ నిరుపయోగమైన కర్మాచారములను ప్రేరేపించుటలో ఆశాపరులైన లౌకిక పూజారులే బాధ్యులగుచున్నారు. ప్రవక్తలు, సద్గురువులు సాధుపుంగవులు వాటిచే బంధింపబడుట లేదు.

★ ★ ★

లౌకికులైన పూజారులు రోజంతా జపతపాదులతో ప్రార్థనలు సలిపి, కర్మకాండలను జరుపుచున్నప్పటికీ వారు ఆధ్యాత్మిక సౌకర్యములను ఏమాత్రమూ ఎవరికీ కలుగజేయ జాలరు. విషవృక్షములను అమృతము బోసి పోషించినప్పటికీ, అవి తినదగిన ఫలముల నీయజాలవు.

★ ★ ★

కర్మలు సిద్ధాంతములను గురించి తరచుగా తగవులాడుకొనుచుండు మతాచార్యులనబడువారు తమ యనుచరులను అగాధమగు చీకటి గోతిలో పడద్రోయ గలుగుదురు. అంధులే, అంధుని యనుసరించెదరు. తానే,

చీకటి గదిలో నున్నవాడు ఇతరులకు వెలుగునెట్లు ప్రసరింప జేయగలడు ? సత్పదార్థానుభూతి లేనివాడు నిజమైన జ్ఞానము నెట్లు ప్రసాదించగలడు ?

★ ★ ★

ఇతరులకుగాక, తన స్వార్థమునకే సేవజేయవలెనను ముఖ్యోద్దేశము గల పూజారి, ఈశ్వరసేవాపరాయణుడని గాక స్వార్థసేవాపరాయణుడనియే పిలువబడవలెను. నిజమైన పూజారి ఏ మతమునకు సంబంధించినవాడైనను, ఇతరులకు ఆత్రముతో నిస్స్వార్థముగా సేవజేయుటయే అతని ముఖ్య లక్షణము. నదీ ప్రవాహమువలె తన జలములను తాను త్రావక యితరుల కుపయోగించు విధమున, నిజమైన పూజారి కుల మత వర్గ వర్ణ భేదములతో నిమిత్తములేకుండా అన్యులకు నిస్స్వార్థముగా ఉపయోగపడవలెను.

★ ★ ★

క్రైస్తవమత ప్రచారకులనబడువారు చాలమంది "జూడా" యనుచరులు మాత్రమేగాని, ఏసుప్రభువుయొక్క అనుచరులుగారు. నిజమైన క్రైస్తవ మత బోధకునియొక్క ఉద్దేశ్యము కేవలము వర్ణమతభేదములు లేకుండా ఇతరులకు నిస్స్వార్థసేవ జేయుటయేగాని అన్యమతస్థులకు జ్ఞానస్నాన సంస్కార (బాప్తిజము) మొసంగుట గాదు.

★ ★ ★

మతగురువనబడు వ్యక్తియొకడు సోదరీ సోదరులమధ్య నొండొరులకు వివాహము న్యాయసమ్మతమని ప్రకటించినచో తక్షణమే యనేకమంది ఆయన కనుచరులయ్యెదరు. కాని సత్యమును పొందుటకు వైరాగ్యమత్యవసరమని సద్గురువు ప్రకటించినచో, బహు కొద్దిమందిమాత్రమే వెంబడించెదరు.

★ ★ ★

ఆ మహోన్నతమైన యాధ్యాత్మిక సత్యమునకు, విశ్వాసములతోగాని, మతములతోగాని, ఆచారములతోగాని ఎంతమాత్రమూ సంబంధములేదు. అయ్యది సర్వమతముల సంకుచితాభిప్రాయములకున్నూ, సిద్ధాంతముల కున్నూ అతీతమైనది. కామ క్రోధ లోభ మోహాన్వితమగు లౌకికమాయను త్యజించినప్పుడే నీవు సత్యమును పొందగలవు.

★ ★ ★

బాహ్యముగా కనబడు, ఒక మతమునుండి వేరొక మతమునకు మారుటయనగా–పంజరమనబడు ఒక బంధమునుండి మరియొక పంజర మను బంధమునందు చిక్కుకొనుటయే. మత సంబంధమైన కర్మకాండల యొక్క హద్దును దాటి నిజమైన ఆధ్యాత్మిక మార్గమునందు ప్రవేశించు టయే ఉత్తమము లేదా, నీ స్వమత పంజరములో నుండుటయే మంచిది.

★ ★ ★

ఒక వ్యక్తి సద్గుణములను గురించి బోధించుటకంటె, వాటి నభ్యాస మొనర్చుటవలన ధీమంతుడగుచున్నాడు. నీతినిగురించి ఇతరులకు సలహా నొసంగుటలోగల సామర్థ్యము ఋషిత్వమున కేమాత్రమూ నిదర్శనము గాదు; మరి జ్ఞానచిహ్నముకూడా కాజాలదు.

★ ★ ★

మనయొక్క మనస్సాక్షి ప్రబోధనల ననుసరించుటయూ, శారీరక మానసిక ఆధ్యాత్మిక స్థితులకున్నూ, మనయొక్క వాతావరణ స్థితిగతుల కున్నూ మిక్కిలి యనుగుణ్యమైన త్రోవ నంటిపెట్టుకొనుటచే, మనము బ్రహ్మైక్యతను పొంది ఏమూల పదార్థము (పరమాత్మ) నుండి –నీ యావ త్ప్రపంచము వెలువడినదో, ఆసత్యపదార్థమును తిరిగి పొందగల్గుదుము.

# తృతీయాధ్యాయము

# ఆధ్యాత్మిక మార్గము

వ్యక్తిగతమగు ప్రత్యగాత్మయే విశ్వాత్మయని యెఱింగెడు సత్యానుభవమే జీవిత లక్ష్యమై యుండవలెను.

★ ★ ★

"నేను" యనెడి సంకుచిత స్వాభిమానమదృశ్యమైనచో, అనంతమగు "అహం బ్రహ్మాస్మి" యనెడి ఉత్తమస్థితి నీలో తనంతటదియే సాక్షాత్కారమగును.

★ ★ ★

ఏ మనస్సునందు, అహంభావాత్మస్తుతులు పూర్తిగా నిర్మూలనమగునో, ఆ మనస్సునకే ఈశ్వరసాక్షాత్కారమగును.

★ ★ ★

మనము కామ క్రోధ లోభములను జయించిననే తప్ప, దివ్యపథము యొక్క దరికైననూ జేరలేము. కపటసాధువుల కంటె అధఃపతితులైన పాపాత్ములే మేలు.

★ ★ ★

నిజమైన యాధ్యాత్మిక ముముక్షువు, ప్రతియవరోధమునూ తుదకు దాటగలడు.

★ ★ ★

ఒకే చక్రముగల శకటమువలె, కామోద్రిక్తుడైన మానవుడెన్ని సుగుణములను గలిగి యున్నప్పటికీ, ఆతడాధ్యాత్మిక పథమందు పురోగమింపజాలడు,

★ ★ ★

విపత్తులు, దురదృష్ట ప్రతికూల పరిస్థితులు నిన్నావహించి, భయకంపితుని జేయునప్పుడు నిరుత్సాహపడి దిగులుజెందకుము. ఈ రూపేణా, ధైర్య సహనములను పొందుటకు నీ కవకాశమును కలుగజేసినందులకు దేవునికి ప్రణమిల్లుము. ఎవరైతే నాపదలలో సహనశక్తి కలిగియుందురో వారు త్వరితముగా, ఆధ్యాత్మికమార్గమునందు ప్రవేశించగలరు.

★ ★ ★

"హైడ్రా" యను బహుశిరస్సులుగల జలసర్పమువలె గర్వము వివిధ రూపములను దాల్చి వంచనీయమై యుండును. గాన, చాల జాగ్రత్తగా నుండవలెను. ఇది తరచుగా అణకువరూపమును దాల్చి మోసగించును.

★ ★ ★

నీ దుష్ప్రవర్తనలను కప్పిపుచ్చుటకు సాకులనుగాని, తప్పించుకునే నెపములనుగాని వెదకుటకు ప్రయత్నించకుము. నీ దుర్మార్గమునకు నీవు పశ్చాత్తాపపడిననేగాని, నీవభివృద్ధి నొందజాలవు. నీయొక్క దుష్ప్రవర్తనలను సమర్థించుటకు ప్రయత్నించుటయన, నీ అంతరసాక్షిని కప్పిపుచ్చి, నీ దుర్గుణములను సద్గుణములుగా కనబడునట్లు చేయుటయే.

★ ★ ★

నీ శరీరపోషణకై తగు శ్రద్ధవహించుము. కాని, దానికి బానిసవు కావద్దు. సదా కాంచనార్థియైన లోభివలె నీ శరీర సంరక్షణార్థమై ఆలోచనా నిమగ్నుడవు కావద్దు.

★ ★ ★

పాలు, శాకాహారము, మానవునియందుండు దివ్య స్థితిని పెంపొందజేయుటకు సహకరించును. అట్లుగాక, గ్రుడ్లు, మాంసము, మద్యపానీయములు, మత్స్యములు మానవునియందు పశుప్రవృత్తిని ఉద్రేకింపజేయును.

★ ★ ★

# సేవ

స్వార్థరహితమైన తలంపులేని సేవయే నిష్కామసేవ.

నిష్కామసేవ నిన్ను ఆత్మానుసంధానమను శిఖరము గల పారమార్థిక పర్వతపాదమునకు చేర్చుటయేగాక, పైస్థితికి తీసుకొనిపోవును. దివ్యమార్గముగుండా చాలమట్టుకు పైస్థితికి తీసికొనిపోవుటయేగాక సద్గురు సందర్శనమునకును; వారికి ఆత్మార్పణము గావించుటకున్నూ సదవకాశములు కలుగజేయవచ్చును.

★ ★ ★

నీ వొనరించు సేవకు ప్రత్యామ్నాయముగా, బహుమాన లాభములను పొందవలెననెడి ఏతలంపుగాని, మరియు తిరిగి వారికి ఈషణ్మాత్రమైనా ప్రత్యుపకార భావన కలుగజేయకుండుట గాని నిజమగు నిష్కామసేవ.

★ ★ ★

పరునకు సాహాయ్యమొనరించుటలో, ఆతడు నీకు ఋణపడియున్నాడని భావింపకుము. పై పెచ్చు పై భావమునకు బదులుగా నీదానపరిగ్రహీత, నిన్ను నీవే యుద్ధరించుకొను నవకాశమును కలుగజేసినాడని విశ్వసింపుము.

★ ★ ★

# వైరాగ్యము లేక సన్యాసము

నిజమైన సన్యాసిగా నుండుట ప్రశంసనీయమే; కాని కపటసాధువుల కంటె, సరళవర్తనులైన గృహస్థులే చాలా మెరుగు. నేడు మిథ్యాచారులగు సాధువులే పెక్కుమంది గలరు.

★ ★ ★

కాషాయాంబరధారియై, భిక్షాటన సల్పుచూ, తీర్థయాత్రలను సేవించి నంత మాత్రమున విరాగియనిగాని, సన్యాసియనిగాని ఋజువుపరచజాలవు. సంకుచిత స్వార్థాభిమానమును, ఐహిక వాంఛలను వీడినవాడే నిజమగు సన్యాసి.

★ ★ ★

జడవాద సిద్ధాంతరీత్యా, లోకమును పరిత్యజించుట కేవలము పిరికితన ముగా కనబడవచ్చును. కాని యాధ్యాత్మిక జీవనము సలుపుటకు గొప్ప ధీరత్వము కావలెను.

★ ★ ★

తన సంకుచిత స్వార్థప్రబోధనల ననుసరించి ప్రవర్తించక, భౌతికాకర్ష ణలకు లోనుగాక సంచరించువాడే నిజమగు సన్యాసి.

★ ★ ★

లోకమునకు నిస్సంగముగానుండి సర్వసంగపరిత్యాగ జీవనము సలు పుటయే నిజమైనయోగము.

★ ★ ★

అంతరాత్మ శుద్ధిగా, హృదయపూర్వకముగా, సమస్త శ్రమలకోర్చి ఎట్టకేలకు దేవుని ప్రత్యక్షముగా చూడవలెననెడి దీక్షాపరులకు ఒకే ఒక మార్గము గలదు. అదియే సంపూర్ణవైరాగ్యము.

★ ★ ★

# ధ్యానము

లక్ష్యశుద్ధిలేని భావము సహితము, కాయకర్మరూపేణా శక్తివంతమై ఎట్లు బహిర్గతమగునో, అదేవిధముగా ధ్యానము లేక, గాఢమైన క్రమ శిక్షణతో యేర్పడిన ఆలోచనగూడా, ఆధ్యాత్మిక ముముక్షువునకు మిక్కిలి

ఉపయోగకారియై ప్రత్యేకమైన స్వశక్తిని పుట్టించును. ఈ శక్తి తక్షణం గాని, లేక త్వరలోగాని బహిర్గతము కాకపోవచ్చును. కాని తుదకు ధ్యాన సాధన తప్పక ఫలించియే తీరును.

★ ★ ★

ధ్యానసాధనకు కట్టుదిట్టమైన ప్రత్యేక యోగాసన సూత్రము లు అవసరములేదు. నీకు మిక్కిలి వీలైన స్థితినే యవలంబించుము. నీ వొక సారి యవలంబించినమీదట, దానినే ప్రతిదినము అదేవిధముగా ఆసీనుడవై పట్టుకొని యుండవలెను.

★ ★ ★

నీ వెంతకాలము ధ్యాననిమగ్నుడవయి యున్ననూ దానినెక్కువకాలమని భావింపకుము. రాత్రిగాని, పగలుగాని ఏవేళయిననూ ధ్యానమునకు అను కూలమే. ఉదయం 4 నుండి 7 గం॥ వరకు ధ్యానమునకు మిక్కిలి అను వైన కాలము.

★ ★ ★

పరమోన్నతస్థితిని పొందవలెనన్నచో, మూడు వివిధమార్గములను నిర్ణయింపవలసివచ్చును. అవి, భక్తి - జ్ఞాన - కర్మ మార్గములు. ముము క్షువు ముఖ్యమైన మూడు క్రమస్థితులద్వారా పయనమొనర్పవలసినదే. అనగా భౌతిక, సూక్ష్మ, మానసిక ప్రపంచములను అనుభవించుటయే.

# చతుర్థాధ్యాయము

## బుద్ధి *

బుద్ధితో దేవుని గురించి చేయు వాదోపవాదములు నిన్ను దేవునియొద్దకు తీసికొనిరాపు సరిగదా, అవి నిన్ను దేవునికి దూరము జేయవచ్చును. కాని దేవుని గురించి చేయు హృదయపూర్వకమగు యెడతెగని ప్రార్థనలు నిన్నా వరించి యున్న యా చీకటి (అజ్ఞాన) తెరను తొలగించును.

★ ★ ★

కేశములను చూచి తలయని భ్రమించునట్లునూ, ఛాయను జూచి వస్తువని భ్రమించునట్లునూ, బుద్ధితో భగవంతునీ, భగవంతునియొక్క సృష్టిని గ్రహించుటయే బ్రహ్మైకృత చెందుటయని భ్రమించరాదు.

★ ★ ★

ఆత్మానుసంధానము లేక, బ్రహ్మైక్యతకై పాటుపడు మానవుని తన నిజమైన స్వస్వరూపము ప్రతి వస్తువుయందును, ప్రతి వ్యక్తియందును కలదని నిరూపించునదియే నిజమైన జ్ఞానము.

---

* అనుభవముయొక్క ముద్రలు (వాసనలు) జీవాత్మలో ప్రోగుపడియుండి, భావములుగను, కామితములుగను, పరిణామమంది కార్యరూపము దాల్చునట్లుచేయు ఉపాధియే మనస్సు. మనస్సును బుద్ధియని భ్రమించరాదు. మనస్సు సమస్తకామ రూపిణి. బుద్ధికి కోరికలతో ప్రమేయమేలేదు. అనాగరికునకునూ, శాస్త్రవేత్తకునూ, ఇరువురికీకూడా మనస్సు గలదు. మొదటివానికి బహుకోరికలును అల్పమగు బుద్ధియు గలవు. రెండవవానికి అధికమగు బుద్ధియును; భావనాశక్తియు గలవు. మనస్సు కామముచే, పేరాశచే, బుద్ధిచేనింపబడన పాత్రతో పోల్చబడినది.

నీ యాత్మను పరమాత్మయని గ్రహించుటయే సత్యమును తెలిసికొనుట. విశ్వము సంకల్పజనితము. ఐనప్పుడు నీ నిజాత్మయొక్క గభీరస్థితిని తెలిసికొనుటకు బదులు భావనాకల్పితమగు విశ్వమును గురించి తెలిసికొను జ్ఞానమునకై యేల ప్రయత్నించెదవు ?

★ ★ ★

హృదయము శిరస్సు (మనస్సు) స్థానమును, శిరస్సు హృదయస్థానమును తీసికొనుటకు సాధ్యము కానప్పటికీ అవి రెండునూ ఒండొంటి శత్రువులుగా నుండనవసరము లేదు.

★ ★ ★

మేధస్సున కాధ్యాత్మిక జీవనములో చాల తక్కువ స్థానము గలదు. హృదయము, మనస్సు రెండునూ సమానముగా ఏకానసముఖెంది సామరస్యము జెందినప్పుడే మానవుడాధ్యాత్మికస్థితిలో బహు త్వరితముగా నభివృద్ధి జెందగలడు.

★ ★ ★

ఆధునిక యువకులనేకమంది తమకున్న గర్వమునే జ్ఞానముగను "తాను" యనెడి స్వాభిమానస్థితిని (అహంకారమును) నిపుణత్వముగను భావించుచున్నారు.

★ ★ ★

నాస్తికత్వము తెలివితో కూడిన గర్వమువలన జనించుచున్నది. వివేకయుక్తమగు నమ్రతవలన భగవదాస్థయందు సంశయమేర్పడుచున్నది. తుదకు నమ్రత, సరళభావములతో కూడిన ఆ భగవదాస్థా సంశయమే సత్యపదార్థమగు దేవునియందు దృఢవిశ్వాసము కలుగునట్లుగా మార్పు చెందగలదు.

★ ★ ★

# మనస్సు

మనోనిగ్రహము కలవాడు సమస్తమునూ స్వాధీనపరచుకొనును.

★ ★ ★

సాధారణముగా సమస్త మానవులయొక్క జీవితము మనస్సుయొక్క అధీనములోనున్నది. కాని, పదివేలమంది వ్యక్తులలో ఒక్కడైనను తన మనస్సును జయించి తన యావజ్జీవితమును అదుపాజ్ఞలలో నుంచుట యరుదు. సుఖ దుఃఖములు, నీత్యవినీతులు, సంతోష వేదనలు, స్వర్గనరకములు, జనన మరణములు, మనోకల్పనలై మనస్సుపై ఆధారపడి యున్నవి.

★ ★ ★

తన మనస్సును పూర్తిగా స్వాధీనపరచుకొనినవాడే నిజమైన యోగి. యోగి అనగా కొంతవరకు సాధనయందున్న ఆధ్యాత్మిక ముముక్షువు. అతడాధ్యాత్మిక క్రమశిక్ష నభ్యసించుచుండును.

★ ★ ★

మనస్సు మనలను మన భౌతిక వాంఛలకు బానిసగా చేయును. అదియే మన యదృష్టమునకు కర్తగా నుండి, ఆ పరమాత్మను పొందునట్లు కూడా చేయగలదు.

అతీతావస్థ (పరాకాష్ఠ) యందే మనస్సు ఆత్మయొక్క నిజస్థితిని తెలిసికొనుచున్నది.

★ ★ ★

చతుర్థాధ్యాయము

# మాయ *

మానవునిలో ఈశ్వరాంశయున్నూ, మాయయున్నూ కలిసియున్నవి. మానవుడు మాయాసంకెలనుండి, ఎప్పుడు పూర్తిగా తనంతటతాను విముక్తిచెందునో, అప్పుడు స్వచ్ఛమైన తన పూర్వభగవదాంశను దప్పక తెలిసికొని తీరును.

★ ★ ★

కామ క్రోధ లోభము లనునవి మాయకు ముఖ్యాధారముగను, కార్య కర్తలుగను యున్నవి. నీవు వాటిని అణచివేసిననే తప్ప, ఈశ్వరాను సంధానమునకు తీసికొనిపోవు బాటయందు చొరబడుట దుర్లభము.

★ ★ ★

* సామాన్య మానవునకు ప్రపంచమును, దాని దృశ్యములును, అది మాయ యని గ్రహించలేనంత నిజముగా కనబడును. గాఢనిద్ర (సుషుప్తి) యందున్న వానికి లోకమేలేదు. ఆ గాఢనిద్రలో నున్నప్పుడు తన సంసారమును గురించి గాని, సంపదలగురించిగాని, వృత్తినిగురించిగాని, ఉపాధిని గురించిగాని, మన స్సును గురించిగాని, అతనికి తెలియుటలేదు. వేయేల? క్లుప్తముగా చెప్పవలె నన్నచో అతనికేమీ (ప్రపంచజ్ఞానము) తెలియదు. కాని, అతని గాఢనిద్రకు భంగము కలిగినప్పుడు స్వప్నావస్థయందు ప్రవేశించును. అప్పుడు తన స్వప్నము లన్నియూ నిజమనియు, సత్యమనియు తలంచును. కాని యతడు, తాను నిజముగా కలగనుచున్నానని అతనికి తెలియదు. స్వప్నములో తాను చేయునది చూచునది నిజమనియు సత్యమనియు భ్రమించును. కాని నిద్రనుండి మేల్కాంచినతోడనే, తన స్వప్నావలోకిత దృశ్యములన్నియు మిథ్యారూపములని తాను గ్రహించును. అట్లే వ్యక్తి, ఆత్మసామ్రాజ్యమును ప్రవేశించినప్పుడు, ఈ లోకముయొక్క అని త్యత్వమును గ్రహించును.

నీ శరీరము, నీ యాత్మయొక్క బాహ్య కవచమైయున్నది. మాయయే నిన్ను శరీరమని భ్రమించునట్లు చేయుచున్నది. అదియే నీ శాశ్వతమైన, అఖండమైన, దేదీప్యమానమగు దివ్యత్వమును మరచునట్లు చేయుచున్నది.

★ ★ ★

మాయ, అజ్ఞానమును కలుగజేయును. మాయయే విశ్వమును దాని యాకర్షణలను వాస్తవమను భ్రమలోనికి మానవుని గొనిపోవుచున్నది.

★ ★ ★

మద్యమునుద్రావి, మత్తెక్కినవానికి ఒకవస్తువే పలురూపములై కన బడునట్లు, ఏకత్వమైన పరమాత్మయొక్క రూపము అహంకారమదోన్మత్తు నకు వివిధరూపములుగా కాన్పించును.

★ ★ ★

ఐహికవాంఛలును, క్రోధము నీ మనస్సు నావరించినపుడు నీ వెంత ధ్యాన తపోనిష్ఠ లభ్యసించినప్పటికీ, మాయామేయమగు బంధములలో ఇంకనూ చిక్కుకొనిన వాడవగుదువు. మాయయే సమస్త చింతలకు, తాపత్రయములకు, బాధలకు మూలాధారమగుచునది.

★ ★ ★

గారడీవాని తాంత్రికములకు కనికట్టు మూలాధారమై యున్నది. నిరా ధారమైన యెండమావులవలె, ప్రపంచము మాయద్వారా వాస్తవమైనట్లు కనబడుచున్నది. పిల్లలు గారడీవాని తాంత్రికములను మెచ్చుకొని, అవి నిజమని యూహించెదరు. కాని పెద్దలు, అతడు మోసగాడనియు వాని తాంత్రికములు మాయతో కూడినవనియు గ్రహింతురు. అట్లే అవివేకులు లోకమే నిజమగు గమ్యస్థానమని భావింతురు. కాని జ్ఞానులకు * అవి భ్రాంతియేయని తెలియును.

★ ★ ★

---

* దివ్యజ్ఞానము కలవారే మహర్షులు.

ఎవరైతే తాము పొందు యీ భౌతిక ప్రపంచానుభవములను నిజమను కొందురో, వారు నిద్ర (మాయ) లోనే యున్నారు. ఎవరైతే వానిని స్వానుభవము వలన అనిత్యమని తెలిసికొందురో వారు దేవుని పొంది, ఆత్మప్రబోధము కలిగినవారగుదురు.

★ ★ ★

సూర్యకాంతి ముందు చీకటి యెట్లదృశ్యమగునో, అట్లే మాయయను చీకటి యందున్నవారికి, సర్వకాల సర్వాంతర్యామియగు ఆ పరమాత్మ కనిపించదు.

★ ★ ★

ఎప్పుడు సంస్కారము * లనెడి మేఘములు విడిపోవునో, అప్పుడు సహజవైభవ సంపన్నుడగు నా భగవంతుడగు సూర్యుని మనము చూడ నారంభింతుము.

★ ★ ★

నీ పరోక్షములో నిన్ను నిందించువారిపై నాగ్రహింపక నీ సంస్కారములనెడి బరువును తగ్గించి, నీకు ఆ విధముగా సేవజేయుచున్నందులకు, వారిని జూచి సంతోషించుము. అంతేగాక తనయొక్క సంస్కారములనే బరువును పెంచుకొనుచున్నందులకు జాలినొందుము.

★ ★ ★

దివ్యపథమును ప్రవేశింపవలెనన్నచో, విషయసుఖములను లేక, ఇంద్రియభోగములను పూర్తిగా త్యజించి, సత్యమును ప్రేమించి మన

* సంస్కారములు :—అహంకార మిశితమగు కర్మలు, కోరికలు, అభిప్రాయములు, సంకల్పములు మనస్సుమీద పడి ముద్రలు (వాసనలు) గా యేర్పడుచున్నవి. అవి మంచివి కావచ్చును లేక, చెడ్డవి కావచ్చును. ముఖ్యమైనవి కావచ్చును లేక, అముఖ్యమైనవి కావచ్చును.

స్సును పరిశుద్ధపరచుటవసరము. మాయాసంకెలనుండి తప్పించుకొని యదార్థవాదిగా నుండి, నిజమును విడనాడక, సత్యము నన్వేషించువాడే నిజమగు ముముక్షువు.

★ ★ ★

"నీ అమూల్యమైన ముత్యములను పందులయెదుట వెదజల్లకుము" జనన మరణములనెడి సంకెళ్ళనుండి, ముక్తియనే మౌక్తికమును విడిచి, హేయమగు ప్రపంచమును ఆశించుటవలన. జడవాదులగు ప్రజలు వరాహములవంటివారగుచున్నారు.

★ ★ ★

ఆధ్యాత్మ అనగా, పరమాత్మయగు భగవంతుని ఎచ్చటెచ్చటనో వెదకనవసరములేదు. ఆయన నీ కతిసామీప్యముననే యున్నాడు. నీతోనే యుంటున్నాడు. అంతర్ముఖుడవై వాని నన్వేషించుము. అహంకారము, కామము, క్రోధము, లోభము అను నాలుగు పెనుభూతములు నీ త్రోవ మధ్య నుండుటవలన నీవు దేవుని సులభముగా చూడలేకున్నావు.



# గమనిక

మానసిక, సూక్ష్మ, స్థూలములను — మూడు ఉపాధులు గలవు. (సామాన్య మానవునిలో ఆధ్యాత్మిక శరీర మభివృద్ధిచెందదు) ఈ యుపాధిత్రయము వలన జీవాత్మ, మనస్సుద్వారా జీవనము సలుపుచున్నది.

(1) మానసిక శరీరము :— పూర్వానుభవముల వలన కలిగిన మనోవాసనలయొక్క ఫలితమే, ఇందు సంకల్పములుగా ఉదయించుచున్నది. ఈ మనోభావములు బీజములవలె అంతర్గతమై యుండవచ్చును. అవి వ్యక్తీకరింపబడినప్పుడు మొట్టమొదట కోరికరూపములను దాల్చి, పంచ జ్ఞానేంద్రియములు కలిగిన (2) సూక్ష్మశరీరముద్వారా ప్రవేశించును. అవి స్వప్నావస్థవలె యచ్చట నుండవచ్చును. లేదా, పాంచభౌతిక కర్మేంద్రియములతో కూడిన (3) స్థూలశరీరముద్వారా కార్య రూపమును దాల్చవచ్చును.

**ఈ మూడు ఉపాధులకు** సంబంధించినవి మూడు చైతన్యస్థితులు గలవు. (1) జ్ఞానరహితమగు చైతన్యము, (2) అర్థజ్ఞాన చైతన్యము, (3) సంపూర్ణజ్ఞాన చైతన్యము; అనగా సంపూర్ణజాగృతి యందున్న చైతన్యము.

మనోమండలములో 5, 6 జ్ఞానభూమికలును, సూక్ష్మమండలములో 1, 2, 3, 4 జ్ఞానభూమికలును యిమిడి యున్నవి. ఆ సప్తజ్ఞానభూమిక లేవనగా—

(1) విజ్ఞానము :—అనగా శుభేచ్ఛ. జీవుడు తన యజ్ఞానమును గురించి తెలిసికొనుట.

(2) అంతస్స్ఫురితము :—అంతరంగ ప్రబోధము (విచారణ) జీవుడు నిజవిచారణ యందు మునిగి పవిత్ర జీవనము సలుపుట.

(3) స్వయంస్ఫూర్తిజ్ఞానము :—అంతరాత్మ ప్రబోధము (తనుమానస) ఐహిక భోగములందు మనస్సు చొరనీక, పవిత్ర మనస్కుడై యుండుట.

(4) అంతరదృష్టి :—(సత్త్వాపత్తి) పూర్తిగ జితేంద్రియుడై శుద్ధసత్త్వ ప్రకాశముతో మనస్సును కేంద్రీకరింప జేయుట. ఇచ్చట యష్టసిద్ధులు లభించును. ఈ

భూమికయందు ముముక్షువు తన ప్రకృతతీతమైన (పారలౌకికమైన) శక్తులచే దేవుని సన్నిధానమునకు తీసికొని రాబడుటకు బదులు మరొక విధముగా నాకర్షింపబడుచున్నాడు.

(5) అనాసక్తి :—(ఆత్మదృష్టి) నిస్సంగాభ్యాసములో నిమగ్నుడై, సత్యపదార్థ (భగవంతుని) సామీప్యములో నుండుటచే, దాని (దేవుని) సాక్షాత్కారమునకై తహతహలాడుచుండును.

(6. దివ్యజ్ఞానోదయము :—(పదార్థభావన) జ్ఞాని, ఈ ఆరవ స్థితిలో సర్వమునూ మిథ్యయనియు, సమస్త వస్తువులు భగవత్స్వరూపములేయనియు గ్రహించి, ప్రతి వస్తువునందు, ప్రతిచోట దేవుని నిజముగా చూచుటయే; అనగా భగవత్సాక్షాత్కారము గల్గును. దీనివలన బ్రహ్మానందము, బ్రహ్మజ్ఞానము లభించును. కాని మనస్సు యింకనూ నశింపకపోవుటచే తాను — భగవంతుడు వేఱుయని భావించును.

(7) తురీయావస్థ :—ఈ సప్తమ భూమికలో స్వ—పరభేదము పూర్తిగ నశించి అద్వైతస్థితి, అభేదభావము) మానవుడు బ్రహ్మైక్యత జెందును; అనగా నా యనంతజ్ఞాన శక్త్యానందములను తిరిగి పొంది, సచ్చిదానంద స్థితి ననుభవించును. ఇదియే క్రీస్తుప్రభువు రేక, పరమ గురువుయొక్క జ్ఞానావస్థానము.

## పంచమాధ్యాయము

# ఆధ్యాత్మిక జ్ఞాన భూమికలు

### సూక్ష్మ, మానసిక మండలములు

నీవు స్వయంభువగు పరమాత్మవు. నీలోనే, సమస్తభూమికలు, గ్రహములు యావత్ప్రపంచమూ యున్నవి. కాని నీకు తెలియదు. అంతర్ముఖుడవై చూడక, బాహ్యముఖుడవై చూచుటవలన అవి నీయందే యున్నప్పటికీ, నీవు వాటి నచ్చట చూచుటలేదు.

★ ★ ★

స్థూల, సూక్ష్మ. మానసికమను మూడుతెరలు మానవుని సత్యపదార్థము (పరమాత్మ) నుండి వేరుపరచుచున్నవి. నీవు నీ సూక్ష్మతెరను తొలగించినప్పుడు నీ మనస్సు ద్వారానే వ్యవహరించెదవు. నీవు నీ మనోతెరను తొలగించినప్పుడు (మనో నాశనము) పరమాత్మతో అనుసంధానము నొందెదవు.

★ ★ ★

అంతర్దృష్టికిని, ఆత్మదృష్టికిని నిజముగా చాలా భేదము గలదు. మొదటిదానివలన సూక్ష్మ ప్రపంచమును చూడగలవు. ఆత్మదృష్టియనగా - భగవంతుని చూచుటయే గాక ప్రతిచోటా భగవంతుని గాంచుటయని అర్థము.

★ ★ ★

నీ చర్మ చక్షువుతో బాహ్యవస్తువులను చూచుచున్నావు. అంతర్లోచనముతో సూక్ష్మప్రపంచమును; దానికి సంబంధించిన భూమికలను చూచుచున్నావు. నీ యాధ్యాత్మిక నయనముద్వారా భగవంతుని చూచుచున్నావు.

★ ★ ★

జీవాత్మ అనగా ప్రత్యగాత్మ లేక బద్ధజీవి మానసిక, సూక్ష్మ, స్థూలోపాధులవలన బంధింపబడుచున్నది. జీవుడు మనస్సుచేతనూ, శరీరముచేతనూ బంధింపబడుచున్నాడు. జీవాత్మ ఎప్పుడైతే ఈ బంధములనుండి విముక్తి జెందునో, అది విముక్తాత్మయగు శివాత్మయై బ్రహ్మైక్యత జెందుటచే కామ రహితుడగును.

★ ★ ★

నీవు మానసిక ప్రపంచమును దాటినప్పుడే భౌతికప్రపంచము శూన్యమని తెలిసికొనగలవు. లోకమూ నిజమే, దేవుడూ నిజమేనని చెప్పువారం దరూ అజ్ఞానములో నున్నారు. ఏలననగా — దివ్యసామ్రాజ్యమును గురించి తెలిసీతెలియని అభిప్రాయములు కలవారగుటచే ప్రపంచమే నిజమని చెప్పు చున్నారు.

★ ★ ★

మామూలు పరిభాషలో బహు సున్నితములైన వస్తువులను గురించి అనగా —— ఈథర్, పరమాణువులు, స్పందనములు, వెలుతురు, స్థలము సూక్ష్మతమమని చెప్పుట సరియే. అవి బహు సున్నితమైన రూపమునందు న్నప్పటికీ, నిస్సందేహముగా జడపదార్థములై యున్నవి. భౌతికపదార్థము లెంత సూక్ష్మరూపములో నున్ననూ ఆధ్యాత్మికమునకు సంబంధించినవాటిని గురించి ప్రస్తావించినప్పుడు, సూక్ష్మమనగా పూర్తిగా వ్యతిరేకమై యుండునది.

★ ★ ★

భౌతిక ప్రపంచము సూక్ష్మప్రపంచమునుండి ఉత్పత్తియగుచున్నది. అందువలన మొదటిది రెండవదానిమీద ఆధారపడియున్నది. సూక్ష్మ ప్రపంచము భౌతిక (జడ) ప్రపంచముకంటె సర్వస్వతంత్రమై దానిమీద ఆధార పడి యుండలేదు.

★ ★ ★

మృతజీవులతో వార్తాలాప సంబంధమనగా - స్థూల, [illegible] ప్రపంచ ములమధ్యదారి యందలి చిన్నగదిలో బాహ్యేంద్రియములు [illegible] వస్థయందు పొందు అనుభవము. అది దివ్యపథమందలి పురోగమనమునకు చిహ్నముగాదు. దానికి మోక్షమార్గమునకూ ఏమియూ సంబంధము లేదు.

మధ్యమ సాధకులగు ఆధ్యాత్మిక ముముక్షువులున్నూ, యోగులును, ఏకైక సత్యపదార్థమును వివిధదృక్పథములతో చూచుచుందురు. అనగా వివిధరీతుల గ్రహించుచున్నారు. సద్గురువులు లేక పరమగురువులు సగుణ రూప సత్యావతరణమగుటవలన సత్యపదార్థముయొక్క నిజతత్వమును తెలిసికొనుటకు ఏ యితర సహాయమూ అవసరములేదు.

★ ★ ★

యోగులు సంపాదించిన మానవాతీతమైన శక్తులు నిజముగా వారివి కావు. సద్గురుప్రేమ రూపేణా వారినుండి వాటిని పొందుచున్నారు. సద్గురువులకు యీ సిద్ధులు వారి జన్మహక్కయి యున్నవి. ఈ ఈవులను వినియోగించుటలో యోగులు బ్రహ్మాండప్రయత్నములు చేయవలసియుండును. కాని, సద్గురువులచే వాటంతటవే అవసరము ననుసరించి ఉపయోగింపబడుచున్నవి.

★ ★ ★

మహిమలను (లీలలు) పరమగురువులు చేసినను, యోగులు చేసినను శాశ్వత సత్యముతో పోల్చి చూచినయెడల నవి యన్నియు మాయాకల్పితములు. ఈ లోకముయొక్క ఛాయారూపములకంటె నవి యథార్థములు కావు.

★ ★ ★

యోగులు చేయు మహిమలన్నియు ముఖ్యముగా స్వార్థముతో కూడినవి. అవి నిశ్చయముగా వ్యక్తియొక్క ఆత్మస్తుతికి సంబంధించిన యుద్దేశ్యములతో నాధారపడి యున్నవి. అట్లుగాక సద్గురువులు లేక పరమగురువు[illegible]

వుల మహిమలన్ననో — మానవకోటియొక్క ఆధ్యాత్మికోద్ధరణ మూల సూత్రములమీద యాధారపడి యుండుటచే పూర్తిగా స్వార్థరహితమై యున్నవి.

★ ★ ★

నిద్రనుండి మేల్కాంచిన పిమ్మట స్వప్నావస్థ నిజము కాదని గ్రహించినరీతి, ఒక వ్యక్తి సూక్ష్మమానసిక ప్రపంచస్థితులను పూర్తిగా గ్రహించినప్పుడే జడమయమగు సృష్టియు దానికి సంబంధించిన అనిత్య అసత్యానుభవములు శూన్యస్వప్నములని గ్రహించును.

★ ★ ★

ఒక మానవుడు యోగసమాధిలో నున్నప్పుడు, అతని మనస్సు తాత్కాలికముగా నశించునుగాని; బుద్ధి, అహంకారములు మాత్రము యథావిధిగనే యుండును. ఎప్పుడైతే * సమాధి స్థితినుండి మేల్కాంచునో, అతని యహంభావము తిరిగి పనిజేయుటకు ప్రారంభించును. నిర్వికల్ప సమాధి యన్ననో, యోగసమాధికంటె చాలా హెచ్చుస్థితి గలది. దీనికిని దానికిని చాలా తారతమ్యము గలదు. నిర్వికల్ప సమాధి స్థితి యనుభవించేముందు సుజ్ఞానము లేక, నిజమైన ఆత్మజ్ఞానమునకు తావిచ్చుటకై బుద్ధి యహంకారములు నశించి తీరవలెను.

---

* (1) సమాధియనగా, నిమగ్నత లేక, తదేక ధ్యానము లేక, మనస్సును పూర్తియైన నిశ్చలస్థితిలో నుంచుట.

(2) జ్ఞానరహితమైన సమాధి మామూలు సుషుప్తివంటిది.

(3) ధ్యాన నిష్ఠవలనగాని, ప్రాణాయామము వలనగాని, యోగు లనుభవించునది యోగసమాధి.

(4) పూర్తిగ దిగువ షష్ఠిభూమికావస్థలు మరచి, సమస్త భూమిక యందున్న మహనీయుడే సత్యానుభవమును బొందునట్టి నిర్వికల్ప సమాధిస్థితిని అనుభవించువాడు.

# సామెతలు

## నానావిధ ద్వాదశ సూక్తులు.

మూర్ఖత్వము లేక, విపరీతబుద్ధి గలిగి చెడుప్రవర్తనతో నుండుటకంటె అహంభావముతో విఱ్ఱవీగి నీతివంతుడుగ నుండుట హెచ్చుగాదు.

ప్రతికూల స్థితిలో నుండగా, అభివృద్ధిలో నున్నట్టి సౌఖ్యమును పొందు వాడునూ, నలువిధములా బాధితుడైనను నిశ్చలముగా సమరసభావముతో నుండువాడును నిజమైన ధైర్యశాలురు.

★ ★ ★

ఒక వృక్షమును దాని పరిమాణమును బట్టిగాక, దాని పండ్లయొక్క సహజగుణము ననుసరించి దాని మంచి - చెడ్డ లెట్లు నిర్ధారణ చేసెదమో, అట్లే ఒకమానవుని విలువ వాని శక్తిసామర్థ్యములనుబట్టిగాక వాటి నెవ్విధముగా నాతడు వినియోగించునో దానినిబట్టి ఆ మానవునియొక్క గొప్పతనమును నిర్ధారణ చేయవలెను.

★ ★ ★

ఔషధమును వర్ణించినంత మాత్రమున యే రోగమునూ కుదురదు. సాధుపుంగవుల (ఋషీశ్వరుల) గురించి వినినంత మాత్రముననే నీవు నిజమైన సన్యాసివి కానేరవు. రోగము కుదురవలెనంటే, మందు తీసికొనియే తీరవలెను. నీవు సన్యసించవలెనంటే, ఋజువర్తనము నభ్యసించవలెను.

★ ★ ★

అహంభావ జనితమైన ఋజువర్తనము నిజమైన సుగుణముగాదు. నిరాశవలన కలిగిన పరాక్రమము నిజమైన ధైర్యముగాదు.

★ ★ ★

శరీరమున కాహారమెట్లవసరమో, ఆత్మకుపాధికూడా కొంతవరకు నవసరమే. నీ యాహారము, మలము రూపేణా విసర్జింపబడినప్పుడు నీవు దానిని గురించి విచారించుటలేదు. అట్లే మరణ సమయమున ఉపాధి విడువబడినప్పుడు నీవు దుఃఖింపవలదు.

★ ★ ★

ప్రకృతి మానవునితో మొదటినుండియూ ఇప్పటివరకూ, ఇకముందు, వ్యతిరేకించి ఎవ్వడూ విరోధముగా నుండుటలేదు. కాని మానవుడు ప్రకృతి శాసనముల నుల్లంఘించుటవలన, ప్రకృతి మానవునితో విరుద్ధభావముగా నున్నట్లు కనబడుచున్నది. ఏ మానవుడు, ఏ జాతియు ప్రతీకార శిక్ష లేక దాని శాసనముల నుల్లంఘింపజాలడు.

★ ★ ★

కనికరముగల మానుషత్వమే నాగరికతకు అధికతమమైన పరీక్షగా నెంచబడవలెను. ఎవరైతే నిర్దయుడై ప్రవర్తించునో వానిని పశుప్రాయునిగా లెక్కింపవలసినదే. విద్వాంసుడుగా నున్నప్పటికీ, లౌకిక జీవిత విధానములో చాల మిన్నగా ప్రవర్తించినప్పటికీ, విజ్ఞాన శాస్త్రమందెంత ప్రవీణత సంపాదించినప్పటికీ, కనికరములేని మానవుడు ఇంకా పశుప్రాయుడుగనే యున్నాడు.

★ ★ ★

అవసరమైనప్పుడు ఆధునిక నాగరికతను వినియోగించుకొనుము. కాని దానికి బానిసవు కాబోకుము. దానినిచూచి, యేవగింపక దానిచే నిషేధింపబడకుము.

★ ★ ★

హిందూదేశము నిమ్న జాతి నిర్మాణమువలన నికృష్టము చెందియున్నది. నిమ్న జాత్యుద్ధరణ ఎప్పుడు జరుగునో, అప్పుడు హిందూదేశము లోక

ములో మహోన్నతదశను అనుభవించు దేశములలో, ఒకటిగానో లేదా, అధికతమమైనదిగానో యుండును.

★ ★ ★

వాగ్ధాటినిబట్టి మేధావి యని పొరపడకుము. గొప్పదగు వాగ్ధార, గొప్ప తెలివితేటలయొక్క అవశ్యక సూచన కానేరదు.

★ ★ ★

ఎవడు సేసములో మణిని పొందుగుట కుద్యుక్తుడౌను ? ఎవడు సీతాకోక చిలుకను తుపాకితో కాల్చును ? ఎవడు కోకిల నిచ్చి వాయసమును స్వీక రించును ? ప్రతి లౌకిక, మానసికవ్యక్తియూ జీవితములో భగవంతునకు వ్యతిరేకించు పనులు ప్రతిదినమూ చేయుచునే యున్నాడు.



## షష్ఠమాధ్యాయము

# పరమగురువు లేక సద్గురువు

గురువు శిష్యునికంటె ఆధ్యాత్మికముగా ఉన్నతస్థాయిలో నుండవలెను. వీలైనచో ఆయన యాధ్యాత్మికముగా పరిపూర్ణుడై యుండవలెను. నీవు బంధములలో నుండి బంధవిముక్తుడవు కావలెనన్నచో, నీ వెవరి నాశ్రయించ వలెను? తప్పక బద్ధుడుగా నున్నవానినిగాక, పూర్ణముగా బంధవిముక్తుడైన వానిని యాశ్రయించవలెను. అదేవిధముగా ఒక పురుషుడు మాయచే నిక ముందు, ఆకర్షింపబడకుండు నట్లభిలషించినచో; ఎవరైతే తన కామోద్రేక ములను పూర్తిగా స్వాధీనపరచుకొని, మాయారహితుడగునో అట్టి మహ నీయు నాశ్రయించవలెను.

★ ★ ★

ముక్తసంగులైన మహాపురుషులు ప్రాపంచక స్థితిలో ఉన్ననూ లేకు న్ననూ, సంస్కారాతీతులు గావున వారికెట్టి యహంభావమూలేదు. మంచి దైననూ చెడ్డదైననూ సంస్కారములే యహంభావమునకు మూల కార ణము. సంస్కారము లెప్పుడు నశించునో, అప్పుడే యహంభావము శాశ్వతముగా నదృశ్యమగును. వేయేల? సంస్కారములు లేనిచో నహం భావమే లేదు.

★ ★ ★

సిద్ధపురుషుడగు గురుని కటాక్షము మహాద్భుత కార్యములు చేయును. కాని, ఆశ్రితుడట్టి గురుకటాక్షము సంపాదించవలెనంటే, సర్వవిధములా ప్రయత్నించియే పొందవలెను.

★ ★ ★

నీవు కేశఖండన గావించవలెనని కోరునప్పుడు, నీ క్షౌరకర్మ పూర్తయే వరకు, మంగలికి నీ తల నెట్లు సమర్పించెదవో, అట్లే నీవు భగవత్సాయుజ్యము పొందవలె నన్నచో, సద్గురువునకు నీ సర్వస్వమునూ సమర్పించవలెను.

★ ★ ★

నీ మనస్సు కరముగను, నీ శరీరము గరిటెగను భావించిననాడు సిద్ధ పురుషుడగు శివాత్మకును, నిర్ముక్తుడగు జీవాత్మకునుగల భేదమే యీ దిగువ రూపమున విశదపరుపబడినది. మొదటి తరగతివారు (అమనస్కులై యుండుటచే) కేవలము గరిటెయను ఉపాధి సహాయ్యమువలననే భుజించు చున్నారు. రెండవతరగతివారన్ననో, మనోకాయములనెడి, కరము-గరిటెల రెండింటిచే భుజించు చున్నారని భావము. (అనగా శివాత్మకు మనస్సు లేమిచే, దానికతీతుడై లోకకల్యాణమునకు మాత్ర ముపాధిని ధరించు చున్నాడు. అట్లుగాక, మామూలు మానవుడు, మనోకాయముల పోషణకై నివసించుచున్నాడని యర్థము.)

★ ★ ★

బ్రహ్మజ్ఞాన స్థితియనగా, మానసికముగా హృదయపూర్వకముగా, ఆత్మ శుద్ధిగా స్వాత్మీయ స్థితిని సర్వకాల సర్వావస్థలయందు గుర్తించుటయే. ఉత్సాహవంతుడగు మానవుడు తనయుల్లాసము నెట్లు ప్రసరింపజేయునో, అట్లే బ్రహ్మచైతన్యముగల మానవుడాధ్యాత్మిక శక్తినట్లు ప్రసరింపజేయును. మరియు ధనికుడైన దాత యితరుల సహాయమునకై ధనమునెట్లు వెచ్చించునో, అట్లే బ్రహ్మజ్ఞాని ఆధ్యాత్మిక శక్తిని ఇతరులకు ప్రసాదింపగలడు.

★ ★ ★

రాగి (లోహము) చింతపండుచే మెరుగుపెట్టబడి ఎట్లు శుభ్రపడు చున్నదో, అట్లే దుర్మార్గుడు సహితము నిజమైన సాధుపుంగవునిచే సంస్కరింపబడు చున్నాడు. రాపిడిలేనిదే చింతపండు సహితము రాగిని ప్రకాశింప జేయలేదు. అట్లే సాధువరేణ్యుడు సహితము, దుర్మార్గుడు తన్నాశ్రయించిననే తప్ప, వారికి మేలొనగూర్చలేడు.

★ ★ ★

సత్సంగమనగా, సద్గురువుతో కేవల సాంగత్యమే గాక, వారిని వెంబడించి వారి యాజ్ఞలను ప్రేమపూర్వకముగా, నుత్సాహముతో నెరవేర్చుటయే.

★ ★ ★

నీ వెవరినాధ్యాత్మిక గురువుగా పరిగణించెదవో, వారికి నీ హృదయాంతర కుహరములను చూపుటకు సంశయింపకుము.

★ ★ ★

తన యాధ్యాత్మిక గురువును, కేవలము ప్రేమకొఱకే ప్రేమించి ప్రతిఫలాపేక్ష లేకయే ఎల్లప్పుడు దానిని సమర్పించుటకు నభిలషించువాడే నిజమైన ప్రేమికుడు.

★ ★ ★

మాయ; దానికి సంబంధించిన వాటికి తప్ప తదితరములచే నీ మనస్సునాకర్షింపజేయని బహు శక్తివంతమయినది. కాని, సాధువరేణ్యుని లేక సద్గురుని కటాక్షమువలన నీ దృష్టి నిన్ను మాయనుండి మరలింపజేసి, పరమాత్ముని యందే కేంద్రీకరింప జేయగలదు.

★ ★ ★

సాధారణ మానవుని సంస్కార సముదాయము, గ్రీకు పురాణములోనున్న "యూజియన్" (Augean) గుఱ్ఱపుశాలతో తగు రీతిగా పోల్చ

వచ్చును. దానిని శుభ్రపరచుట కడు దుర్లభము. కాని (గ్రీకుదేశపు మహా పరాక్రమశాలియగు) "హెర్క్యులస్" (Hercules) ఆల్ఫీయస్ (Alpheus) అను నదీప్రవాహమును త్రిప్పి యూజియన్ గుఱ్ఱపుశాలను శుభ్రపరచినట్లు, ఏ మానవునియొక్క సంస్కారములనయినను సద్గురువు తన యాధ్యాత్మిక (శక్తి) బడబాగ్నిచే దహింపచేయగలడు.

★ ★ ★

సత్యపదార్థమగు పరమాత్మ ప్రాపంచక వ్యవహారములను నడపుటకు గాని, మాయనుండి ఇతరులను బంధవిముక్తుల జేయుటకుగాని, మాయను వినియోగించడు. సృష్టికర్తయగు ఈశ్వరుడు (బ్రహ్మ) ప్రపంచమును సాగించుటకు మాయ నుపయోగించును. కాని సద్గురువన్ననో, తదితరులకు విముక్తి గలిగించుటకు మాయను వినియోగించును.

★ ★ ★

అతీత చైతన్యమననేమి? అజ్ఞానావస్థితిని పూర్తిగ తెలిసికొనుటయని అర్థము. అనగా స్వాత్మయగు దివ్యాత్మను తప్ప తదితరములను యెఱుగకుండుటయే.

★ ★ ★

నీ యంతర సాక్షిప్రబోధనలకు వ్యతిరేకించి లోకమునుగాని, సద్గురువునుగాని, సంతోషపెట్టుటకేమియూ చేయకుము. లోకము ధిక్కరించినను, నీకేది న్యాయమనియు, సరియైనదనియు తోచునో, దానిని నిస్సందేహముగా చేయుము. నలుదిక్కులనుండి తీవ్రమైన ఝంఝామారుతముతో కొట్టబడినప్పటికీ, చలించని దృఢమైన జాతికొండవలె నీ మనస్సు నిబ్బరముగ నుండవలెను.

★ ★ ★

## శ్రీ మేహేర్ సుభాషితములు

నీ వెట్టి దుర్మార్గ గుణములచే ఆవేశింపబడినప్పటికి, నా యెదుట అనగా శివాత్మ లేక సద్గురుపు యెదుటకు వచ్చుటలో ఎంతమాత్రము సిగ్గుపడక శంకింపక రమ్ము. నేనందరికొఱకునూ యేర్పడియున్నాను. సన్మార్గులకు నన్నాశ్రయించుటకెంత హక్కు గలదో, దుర్మార్గులకు కూడా అంత హక్కుగలదు. నిజముగా పతితుల నుద్ధరించుటయే నా ప్రధానాశయము.



# సప్తమాధ్యాయము

## భగవంతుఁడు

భగవంతుడు ప్రేమించదగినవాడేగాని, భయమొందవలసినవాడు కాదు. వాస్తవముగా ఎవరునూ చేపునిగురించి భయపడరు. బాలురుపాధ్యాయుని జూచి భయపడక, బెత్తమును జూచి భయమొందునట్లు; అనేకులు వారు చేసిన పాపములకు నరకము ప్రాప్తించుననిగాని, లేక ఏదోయొక శిక్ష ననుభవించుట తటస్థించుననిగాని భయపడుచుందురు.

★ ★ ★

చేతనాచేతనములగు సమస్త రూపములందునూ అనిమేషముగా సర్వ కాలములయందు ఏకైక సూర్యుడగు, అద్వితీయుడగు భగవానుడు ప్రకాశించుచున్నప్పటికీ కోరికలచే నావరింపబడిన అజ్ఞానమనెడి గదిలో నీవు బంధింప బడుటచే ఒక్కనిమేషమైనను భగవంతుని చూడలేకున్నావు.

★ ★ ★

విరాట్స్వరూపమగు భగవంతుడు శిల, లోహ, వనస్పతి, మూగజంతు, మానవరూపములనెడి వివిధ పాత్రల ధరించి; వీటియొక్క ప్రతిదాని జీవ సముద్వారా తన స్థూల – సూక్ష్మ స్థితులయొక్క ఆవిష్కారానుభవములను పొందుచున్నాడు, ఆ యవిభాజ్యమగు సత్పదార్థమే (పరమాత్మయే) బ్రహ్మైక్యత జెందిన ముక్త పురుషుడుగాను లేక, ఆధ్యాత్మిక స్థితియందున్న పూర్ణ పురుషుడుగానున్న సద్గురువుగాను యుండి, భౌతిక – సూక్ష్మ ప్రపంచముల కతీతమైన యాతని నిజావస్థానమును (సచ్చిదానంద స్థితిని) అనుభవించుచున్నాడు.

★ ★ ★

నీ స్వస్వరూపమును జూచి భయమొందకుము. నీవు వాస్తవముగా "ఆత్మ"ను కలిగి యుండుటయేగాక, ఆ యేకైక పరమాత్మయగు ఆత్మయే నీవు. నీ స్వస్వరూపమును జూచి భయపడినచో, నీవు భగవంతుని నుండి వేరుపడి దూరమైపోవుచున్నావు.

★ ★ ★

నీవు దూరదర్శిని (బైనాక్యులర్) ద్వారా, దూరపు వస్తువులను చూచిన యెడల, అవి దగ్గఱకు తేబడినట్లు కనిపించును. అదే యంత్రమును రెండవ ముఖముద్వారా త్రిప్పి చూచినయెడల ఆ వస్తువులే చాలా దూరమునకు తీసికొని పోబడినట్లు కనిపించును. మనము జడమగు మాంసచక్షువులనెడి బాహ్య కుంభకటకములద్వారా చూచుటవలన దేవుడు మనకు దూరముగా నున్నట్లు కనిపించుచున్నాడు.

★ ★ ★

స్వప్నములు ఎంతవరకు నిజముగా నున్నట్లు కనబడుచున్నవో, అట్లే బాధ — చెడుగులు కూడా అంత నిజమని తెలిసికొనవలెను. (అనగా నిజము కావు) పూర్తిగా ఆలోచించినచో దేవుడొక్కడే నిజము. బాధ — చెడుగులతో సహా తదితరము లన్నియు అనిత్యములు. సుఖదుఃఖములు, మంచి చెడ్డలు అన్నియు తారతమ్య సంబంధములు కలవు. ఇవి ద్వైతస్థితుల యొక్క సిద్ధాంతమును ఉదాహరించుచున్నవి.

★ ★ ★

దేవుని తప్ప తదితరము లన్నింటినీ చూడకుండుటయే దేవుని చూచుట యని అర్థము.

★ ★ ★

నీ ఛాయారూపము నిన్ననుసరించి ఎట్లు విడనాడకుండునో, అదే విధముగా దేవుడు నీకు బాహ్యముగా నుండుటలేదు; కాని నీలోనే నివసించుచున్నాడు. నీ వేరీతిగా నీ ఛాయారూపమును పట్టుకొనలేవో, అదే విధముగా నీవు భగవంతునియొక్క మామూలు విధానమును పొందజాలవు. లక్షలాది జనులలో ఏదో బహుకొద్దిమంది మాత్రము భగవత్సంధానమును పొందగలరు.

★ ★ ★

"ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" యను సూక్తిప్రకారము దేవుడు గణిత రీత్యా ఏకవస్తువుగాక, అద్వితీయుడై ఎల్లప్పుడూ ఒక్కడేయై యున్న ఏకైక సత్పదార్థము. భగవంతు డెల్లప్పుడూ అనంతుడై యుండెను; అనంతుడై యున్నాడు; అనంతుడై యుండనున్నాడు.

★ ★ ★

పరమాత్మునకు తన నిర్గుణ (పరాత్పరపరబ్రహ్మ) స్థితిలో, ఎఱుక లేకయే తన యనంతశక్తుల ననుభవించుచు పోషించుకొనుచున్న పరమాత్మయని తెలియదు. పరమాత్ముడు, శివాత్మ లేక సద్గురావస్థానములో తాను పరమాత్మయను పూర్తి యెఱుకను కలిగి యున్నాడు.

★ ★ ★

మానవుడు పరిమిత స్థితిలో నున్నాడు. అతీతుడు కావలెనన్నచో అనంతత్వమును (భగవత్సాయుజ్యము) పొందవలెను. పరమాత్మ డెల్లప్పుడునూ అతీతస్థితిలోనే యుంటున్నాడు.

★ ★ ★

## శ్రీ మేహేర్ సుభాషితములు

భగవంతుడొక్కడే. సమస్తము ఈశ్వరమయమే. దేవుడొక్కడే సత్య దార్థము. విశ్వమన్ననో అనేకత్వముతో నిండియున్నది. అయ్యది శూన్యమునుండి బయలువెడలి మాయాబద్ధమైయున్న కారణముచేత మిథ్యా రూపమై కాన్పించుచున్నది. వివిధ వస్తువులను వివిధములుగా చూచినంత వరకు, ఆ యేకత్వమును (దేవుని) చూడలేవు. వివిధ వస్తువు లదృశ్యమై నప్పుడే ఏకవస్తువు (దేవుడు) గోచరించును. అభూతకల్పనమగు విశ్వమ దృశ్యమైననాడే, ఆ యేకైకేశ్వరుని చూడగలము. మానవుని సంకుచిత స్వార్థమెప్పుడు నశించునో అప్పుడతనికొఱకు ప్రపంచమున్నట్లు కనబడదు.

# గమనిక

దేవుడు తప్ప మరేదియూ లేదు.

నిజమగు విలువగల వస్తువులు మూడుమాత్రమే: ఏవనగా:—1. దేవుడు, 2. ప్రేమ, 3. సద్గురువు (పరమగురువు) ఈ మూడునూ యించుమించు ఒక్కటేయై సమానమైనవి.

ఆ యేకైక పరమాత్మ లేక, అధ్యాత్మయే సర్వశక్తివంతుడుగాను, సృష్టికర్త (ఈశ్వరుడు) గాను, శివాత్మ (సద్గురువు) గాను; జీవాత్మగాను వివిధ పాత్రల ధరించుచున్నాడు.

సర్వశక్తివంతుడగు నా యధ్యాత్మ (భగవంతుడు) ఎఱుకగలిగిన బ్రహ్మైక్యావస్థానమును సహితము దాటి యావల నున్నాడు. ఆయననంతుడు; అతడు దరిలేని సత్యమహాసాగరము. బ్రహ్మ—విష్ణు—మహేశ్వర స్వరూపమగు నా ఈశ్వరుడే విశ్వమునకు సృష్టి—స్థితి—లయకారుడై యున్నాడు.

ప్రత్యగాత్మ లేక జీవాత్మ దేవుని పొందజాలక మాయామోహ ప్రపంచస్మృతి గలిగి, అంతముగలవాడై పరిమితుడై యున్నాడు.

శివాత్మ—బ్రహ్మైక్యత జెందిన మానవుడై, తాను సర్వశక్తివంతుడనియు, ఆయనంత మహాసాగరమగు ఏకైక సత్యపదార్థము తానేయనియు తనకు తెలియదు. ఆయన ఏసుప్రభువు (కృష్ణుడు) యొక్క అతీతచైతన్యావస్థానమును పొంది యున్నాడు. శివాత్మయే, సద్గురువై (పరమగురువు) యున్నాడు. తాను ప్రతి జీవాత్మయందునూ ఉన్నాడనియూ, ప్రతి జీవాత్మయూ తనలో నున్నాడనియూ ఆయనకు తెలియును. ఈ పరమగురువే ప్రేమ—ప్రేయసి—ప్రియులై యున్నాడు.

సంపూర్ణము

## అవతారపురుషుని గూర్చిన ఆంధ్ర గ్రంథములు

1. **మెహెర్ బాబా :**

   యుగావతార పురుషుడగు శ్రీ మెహెర్ బాబా జీవిత చరిత్రమును, బోధలును ఈ గ్రంథమున ఐదు ఆశ్వాసములలో విపులముగ తేట తెలుఁగున వ్రాయబడినవి.

   రచయిత : శ్రీ యల్లాపంతుల జగన్నాధం, బి.ఏ., వెల 2–0–0

2. **అవతార సద్గురు శ్రీ మెహెర్ బాబా :**

   ఇందు శ్రీ బాబా జీవితచరిత్రమును, బోధలును చక్కని వ్యావహారిక భాషలో సంగ్రహముగ వ్రాయబడినవి. వెల 0–8–0

   రచయిత : డాక్టర్ శ్రీ తోట ధనపతిరావు, L. M. & S.

3. **శ్రీ మెహెర్ గీతావళి :** వెల 0–8–0

4. **శ్రీ మెహెర్ సుభాషితములు :**

   ఆంధ్రానువాదము; సరళమైన భాషతో చక్కని శైలితో అద్వైత సారాంశం. వెల 1–0–0

   అనువాదకుడు : డాక్టర్ శ్రీ తోట ధనపతిరావు నాయుడు, L.M. &

ప్రతులకొఱకు—

శ్రీ ఇవటూరి చెన్నమల్లికార్జునరావు,
సెక్రటరి,
మెహెర్ పబ్లికేషన్స్ (ఆంధ్ర) లిమిటెడ్,
రామనగర్ - నిడదవోలు, (పశ్చిమగోదావరి జిల్లా)